Acc No: 25324

# విశ్వదాభిరామ వినురవేమ తందాన తాన వంటిది కాదు కాముక వైరాగ్య దశలు రెంటికీ సరిపడగల యర్థమున్నట్టిదే

అపండితుడుగా కానవచ్చిన వేమన తన ఆట వెలదికి కూర్చిన మకుటానికి అర్థ నిర్ణయం మన పండిత షరాబులకు వల్ల దప్పిన విషయమై శతాబ్దులుగా వుండి పోయింది. ఎందరో ప్రయత్నించారు; పాండిత్యమంతా వెచ్చించి చాలా అర్థాలు తీశారు. ఏ సంస్కృతాంధ్ర లాక్షణిక మహాకవి పద్యపంక్తికీ కుదరనన్ని అర్థాలు ప్రయాసపడి సాధించి యిచ్చారు.

'విశ్వదాభిరామ వినురవేమ' అన్నదే మకుటుంగా తీసుకొని చెప్పిన అర్థాలు లెక్కకిప్పటికి అష్టాదశ సంఖ్యకు చేరుకొన్నాయి; మించినై. యీ మకుటానికి పాఠభేదాలు మరో నాలుగున్నాయి:

'విశ్వతాభిరామ వినురవేమ' - 'విశ్వతోభిరామ వినురవేమ' - 'విశ్వథాభి రామ వినురవేమ' - 'విశ్వతాభిరామ వివరివేమ' అంటూ కొన్ని వ్రాతప్రతుల్లో - చిన్న ప్రతుల్లో - కనిపించుతున్నాయి. ఇందులో 'విశ్వతాభిరామ వినురవేమ' అన్నది విశ్వదాభిరామ కన్నా కూడా బాగున్నదని గ్రహించి అర్థం చెప్పిన రాళ్ళపల్లి వారున్నారు. కాని తక్కిన మూడూ అర్థవంతాలని, వ్యాకరణ శుద్ధాలనీ భావించలేదనుకొంటాను వారుకూడా. వానికేమైన అర్థగతి కలిగించవచ్చు ననుకొంటే మాత్రం అర్థం చెప్పకుండా వదిలేవారు కాదనుకొంటాను. అర్థవైచిత్రిని సాధించటం మన పండితులకొక క్రీడ, వినోదం గదా! వినోదమయితే మనం కూడా ఎందుకు వదలాలి. వాటికీ అర్థం రాబట్టుదాం - ఆ చోద్యమూ చూద్దాంమరి.

మున్ముందుగా 'విశ్వదాభిరామ వినురవేమ'కు చెప్పిన అర్థ జాలాన్ని వేడుకగా చూడవచ్చు .

1. Listen O vema! Dear to the Lord of all
   సర్వేశ్వరునకిష్టుడైనవాడా! వేమా! వినుము. (సి.పి.బ్రౌన్)
   తిరుగుబోతుగా? నున్నప్పుడు కూడానా?

2. O Vemana! the beloved of the gods.
   వైశ్యాలోలుడగా వున్నప్పుడు, తిరుగుబోతుగానున్నప్పటి దశలో కూడా
   దేవ ప్రియుడా! వేమా! విను. దేవతలకు ఇష్టుడైనవాడా! వేమా! విను.

(పిశుపాటి కృష్ణమూర్తి)



3, విశ్వమునిచ్చు భగవంతునికి యిష్టుడైనవాడా! వేమా! వినుము.
వేశ్యావశుడైన దశలో యిలా వ్రాయవచ్చునా ? (వంగూరి సుబ్బారావు)

4. విశ్వమును సంహరించునట్టి, అనగా, విశ్వలయకారుడైనట్టి శివునికి ప్రీతిపాత్రుడా! వేమా! వినుము. (పానుగంటివారు)

5. విశ్వమును అనగా అందరను ద. అనగా ఖండించినవాడు, అనగా విమర్శించిన వాడై అందరికీ వడ్డించుటచే ప్రీతిగూర్చువాడా! వేమా! వినుము.
(ఇది హాస్యంగా కావచ్చు రాళ్ళపల్లి వారు)

6. విశ్వమును అనగా సమస్తమును, అనగా, అన్నిటికంటే గొప్పదైన జ్ఞానము నిచ్చుటచేత ఇష్టుడైనవాడా! వేమా! వినుము.
జ్ఞానియైన దశకీ, యోగియైన దశకీ వర్తించును మాత్రమే కాముకదశకు యిది వర్తించదు గదా!
((శ్రీకాకుళంజిల్లా) మహామహోపాధ్యాయ, ఆచంట సాంఖ్యాయనశర్మ)

7. విశ్వమును అనగా ప్రపంచమును త్యజించుటచేత ఇష్టుడైనవాడా! అనగా సంసార దశకు వర్తించదు గదా! సన్యసించుటచేత ఇష్టుడైనవాడా! వేమా! వినుము. అనగా సానివాడలోనూ, సంసారదశకు, వర్తించదు గదా! సాని సరదాలోను, సంసారదశకు, యిది తొలిదశకు వర్తించదు గదా!

8. విశ్వమును సమస్తమును ఇచ్చి వేయుటచేత ఇష్టుడైనవాడా! వేమా! వినురా!. అనగా సానితో వున్న, సంసారదశకు, వర్తించదు గదా! సాని తగులములోను, సంసారదశలోను, తొలిదశకు సాంగత్య దశకు వర్తించదు గదా!
(విమర్శకాగ్రేసర, బండారు తమ్మయ్య)

9. విశ్వదుడనగా బ్రహ్మ - అతనికి ఇష్టుడైనవాడా! అనగా బ్రాహ్మణుడా! వేమా! వినుము.
వేమన బ్రాహ్మణుడు మాత్రం కాదు గదా! (టేకుమళ్ళ కామేశ్వరరావు)

10. విశ్వదయను - వేశ్యయందు ఇష్టుడైనవాడా! వేమా! వినుము.
ఆ వేశ్య అసలున్నదా? అట్టి పేరొకటున్నదా? అసలు, ఉంటుందా? అందులో వేశ్యకు, (పురాణపండ మల్లయ్య శాస్త్రి)



11. విశ్వదుడు విశ్వకర్మ అయిన అభిరామయ్య! వేమా! వినుము.

12. విశ్వదుడు అనగా సర్వస్వమును ఇచ్చివేసిన, త్యాగము చేసిన అభిరామయ్యా! వేమా! వినుర.

13. విశ్వదుడు అనగా సర్వస్వమును త్యాగముజేసిన అభిరామయా! వేమనను వినుము. (డా.సి.వి. రామచంద్రరావు)
వినురాయని శిష్యుడు గురువును సంబోధించ వచ్చునా?

14. వేశ్య అయిన విశ్వదా! విశ్వకర్మకులజుడైన అభిరామయ్యా !
వేమా! వినుము.
విశ్వదాభిరాముడనగా విశ్వకర్మకులజుడని ఎక్కడుంది?

15. Hark O Vema! Delighter of the world !
విశ్వాభిరాముడైన వేమా వినుర.

16. విశ్వదునకు విశ్వకర్మకు యిష్టుడైనవాడా! అనగా విశ్వబ్రాహ్మణుడా! వేమా! వినుము.

17. విశ్వదునియందు అనగా విశ్వబ్రాహ్మణులందు ప్రీతిగలవాడా! వేమా! వినుము. పాఠకులే తెలియగలరు. బ్రాహ్మణ నింద యితనికున్నదే మరి!

18. విశ్వదులకు విశ్వబ్రాహ్మణులకు! యిష్టుడైనవాడా! వేమా! వినుము

## ఇక పాఠభేధాలకు చెప్పుకోగలిగిన అర్థాలు :

19. విశ్వతాభిరామ అనగా సమస్తమును తానే అనుభావమువలన బుద్ధివలన ప్రీతిపాత్రుడైనవాడా! వేమా! వినుము. (రాళ్ళపల్లివారు - 1917)

20. విశ్వథాభిరామ అనగా విశ్వకల్యాణమందు ఇష్టుడైనవాడా! వేమా! వినుము. విశ్వథాభిరామ అయితే అన్నివిధములచేతను వేశ్యాలోలుడైన దశలో కూడానా? ప్రీతిపాత్రుడైనవాడా! వేమా వినుము.

21. విశ్వతో భిరామ అనగా సమస్తత్వముచేత, లేక ప్రపంచ స్వభావమునందు ప్రీతికలడైనవాడా! వేమా! వినుము. ఇది, యోగిదశకు వర్తించునా?

22. విశ్వతాభిరామ! వివరివేమ! : విశ్వతాబుద్ధిచేత యిస్టుడైనవాడా! జ్ఞాని అయిన వేమా! (తెలుగులో వివరి అనగా జ్ఞాని)



ఇందులో విశ్వతాభిరామ బాగున్నదని మొదట మెచ్చుకొని నచ్చినదని, ఇది వట్టి సంబోధననే క్రియారహితము అనగా వావిళ్ళవారికి వ్రాసినప్పుడు 1917లో జెప్పి తుదకు 1928లో రాళ్ళపల్లి వదులుకొన్నామన్నారు. ఇది వారి దొడ్డబుద్ధి. చిత్తశుద్ధి.

ఇంత చిన్న పంక్తికి ఇన్నిన్ని అర్థాలు, పెద్దపెద్ద అర్థాలు విన్యసించిన వైనం ఏ భాషలోనైనా వున్నదా అన్న ప్రశ్న తప్పక కలగవలసిన ప్రశ్న. ఉందో లేదో నాకు మట్టుకు తెలియదు. నాకు తెలిసిందెల్లా ఇదొక్కటే - కడపటికి 'తత్త్వమసి' అన్న మహావాక్యానికైనా ఇన్ని అర్థాలు వినిపించలేదు.

ఇలా రెంటికి అష్టాదశార్థాలు చెప్పుకోగలిగినప్పటికీ, ఇందులో ఏ వొక్కటీ వేమన జీవితంలోని రెండు దశలకూ వర్తించే అర్థం, చెల్లే అర్థం కాకపోతున్నది. కాని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారన్నట్లు "వేమన స్వచ్ఛందచారిగను, సానిసాంగత్య దశలోనూ, సంసారిగాను ఉన్నప్పుడు వ్రాసినవని ఊహింపవలసిన అనేక పద్యములున్నవి". అప్పుడు కూడా ఇదే మకుటుంతో వ్రాశాడు. సానిదాని పొందు సౌభాగ్య భాగ్యంబు..... కూడు నీళ్ళు బాసి గుళ్లపంచలబడునట్లు వ్రాసె బ్రహ్మ, యతులనొసట, తోయజాక్షిజేర దోషంబుగలదొకో, తుంటవింటివాని తూపులఘాతకు, మింటిమంటినడుమ మిడుకదరమె ఇంటియాలి విడిచిఎట్లుండవచ్చురా విశ్వ ..........'' యన్నటువంటివి అనేకం వున్నాయి. ఇంకా బూతులున్నాయి. అసలు బ్రౌన్ 150 బూతు పద్యాలను ల్యాటిన్ చేసి దాచుకొన్నాడు.

అట్టి దశలో దేవునికి ప్రీతిపాత్రుడైనవాడని, సర్వం యిచ్చినవాడని, త్యజించినవాడని, దాతయని, బ్రహ్మకు ఇష్టుడు అని బ్రాహ్మణుడని అంటే అందరిని విమర్శించినవాడని, సర్వంతానై వున్నానన్న భావంగలవాడని - అన్ని విధాల సర్వధా ప్రీతిపాత్రుడని - వివరియని అర్థాలు చెప్పడం అసందర్భంగదా! అవి నిజమైన అర్థాలు ఎలాగవుతాయి!

అందుచేతనే "సహజమైనయర్థము దీనికిదివరకు లభింపలేదు. ఇకముందు లభించునను యాశయును నాకులేదు. దీనికర్థమే లేదనుకొని యింతటితో నూరకుండుట మేలు'' అని 1928లో రాళ్ళపల్లి వారు తమ వేమన గ్రంథములో కడకు తేల్చి చెప్పారు. వారు అట్లు కడమాటగా చెప్పినప్పటికింకా ఇన్ని అర్థాలు లేవు. అన్నీ అప్పటికి ఏడు కాబోలు ఉన్నవి. కాని వారుచెప్పినట్లు ఊరుకోలేక, వారి ఆక్షేపణను మనసులోబెట్టుకోకనే మన పండితులిన్ని అర్థాలను ఆ తర్వాత కూడా తయారుచేశారు. అవన్నీ రాళ్ళపల్లి వారి ప్రశ్నకు ఆహారమైపోతున్నాయి. అందులో కొన్ని తప్పులు. అర్థాలే తప్పులు. కొన్ని ఏకవచన క్రియావాచకము వినురవేమ ఉన్నదనే స్ఫురణ లేకుండా తననూ వేశ్యనూ - అభిరామయ్యనూ



- అనగా ముగ్గురమా! తననూ వారిద్దరినీ - సంబోధించుకొంటూ చెప్పినట్లు కూడా అర్థాలు కూర్చారు. తననూ ఇతరులనూ పేరుపెట్టిపిలిచి 'వినరా' అని అంటారా? "వినుడి" "వినుము' ' వంటి బహువచన క్రియారూపాలు వాడుతారు. గదా! అనైనా ఆలోచించకుండా అర్థనిర్ణయం చేశారు. అభిరామయ్యా! అందులో గురువును వేమన్నను వినురా అని కూడా అర్థం చెప్పారు. అప్పుడు 'విశ్వదాభిరామా! వినురవేము' అనాలిగాని 'వినురవేమ' అని అనరాదనీ, అనేవాడుకాదని గమనించడం లేదు. 'వినుర' అనే ఏకవచన క్రియారూపం ఆత్మసంబోధననేగాని అన్యసంబోధనను అనుమతించదుగదా! అనగా అందుచేత విశ్వద అనే వేశ్యనూ, అభిరామయ్య అనే నగరివిశ్వబ్రాహ్మణుణ్ణి చొప్పించడానికి అనుమతించదు.

"విశ్వతాభిరామ వివరి వేమ" అన్న పాఠంలో అసలు క్రియేలేదు. కాని ఇది 'విశ్వదాభిరామ' కాకపోయింది. దానితో ఇక్కడ కూడా 'అభిరామ' శబ్దం నామవాచకమే కాకుండా పోతున్నది. దీనివలన అభిరామయ్యకు క్రియావాచక బాధలేనప్పుడుకూడా చోటు లేకుండాపోతున్నది.

"విశ్వదాభిరామ వినుత వేమ" అని - "విశ్వదాభిరామ వివరివేమ" అని గనక వున్నట్లయితేనో, 'విశ్వదాభిరాము వినురవేమ' అనిగాని వున్నట్లయితేనో అభిరామయ్యకు అవకాశం వుంటుంది. కాని అటువంటి పాఠాలు లేనేలేవు! అసలు ఉన్నప్పటికీ మొదటిబాధ వుండనే వుంటుంది. ఈ కట్టుకథ ప్రకారం కూడా వేశ్యాసాంగత్యం వదిలేసిన తర్వాతే, వైరాగ్యం ఏర్పడిన తరువాతనే వేమనకు నగరికంసాలి అభిరామయ్య తటస్థపడ్డాడు. అందుచేత, వైరాగ్యములో కూడా వేమన వేశ్యను ఇంద్రియలోలత్వాన్ని మరవలేదనవలసివవుంటుంది. ఇది అసంగతం.

ఈ అష్టాదశార్థాలు ఇలా పనికిరాకుండా పోగా, రాళ్ళపల్లి వారన్నట్టు దీనికి అర్థమేలేదని ఊరుకోవడమేనా? ఇంకేమైన దారివుందా అంటే వుందనుకొన్నాను నేను. అయితే దానికిదారి నిఘంటువులదారి మాత్రం కాదు - తత్త్వ సిద్ధాంతాల దారేదారి - అని విశ్వాన్ని, విశ్వదృశ్యాన్ని వివరించిన దారేదారి అని నేను భావించాను.

తత్త్వ సిద్ధాంతాలనగానే కంగారుపడనక్కరలేదు. గహనమైన చర్చ చెయ్యకుండానే, ఈ దేశంలో సర్వసామాన్యంగా తెలిసినపాటి కొద్దిపాటి తత్త్వంతోనే సరిపెట్టుకొని వేమనమకుటానికి సహజమైన-సులభమైన-ఇంద్రియలోలము, ఇంద్రియ జయము కలిగిన రెండు దశలకు కూడా వర్తించే - అర్థం, అర్థాలు చెప్పుకోవచ్చు. గాఢమైన గహనమైన సూక్ష్మమైన చర్చజేసి ఇంకా లోలోతులంటే అర్థాలు సైతం సుసంగతంగా చెప్పుకోవచ్చును.

సులభసులభంగా చెప్పుకొనచూద్దాం. మనస్సు, మాయ, అవిద్య, ప్రకృతి అన్న మాటలు తత్త్వవిషయంగా ప్రాథమికమైన సంగతులుగదా. ఈ నాలుగూ విశ్వరచనకు

కారణాలేమరి! మనసు గారడీయే విశ్వదృశ్యం అంటారుగదా వేదాంతులు. అంతే. ఈ నాలుగింటినీ విశ్వదాలుగా చెప్పుకోవచ్చు. ఇంకా కొంచెం దూరం వెళ్ళితే, విశ్వ విశ్వదృశ్యం పంచేంద్రియాలకల్పనగా, శబ్దస్పర్శరూపరసగంధాలనే పంచతన్మాత్రల పరిణామశిల్పంగా, భూమ్యాకాశాగ్ని వాయుర్జలాలు అనే పంచభూతాల లీలగా చెప్పుకోవడం భారతదేశంలో బహుసామాన్యమైన విషయం. పంచేంద్రియాలు, పంచభూతాలు, పంచతన్మాత్రలు అన్నవి అవి కూడా విశ్వదాలే..ఇలా విశ్వదాలు ఏడుగా తేలుతున్నాయి.

ఇక అభిరామ శబ్ద విషయం. ఇదేదో గూఢమైన మారుమూల శబ్దంకాదు. పట్టాభిరామ, మునిజనమనోభిరామ, నయనాభిరామ, లోకాభిరామ వంటి సమాసాల ద్వారా రామకథతో రామభక్తిలో అందరూ ఎప్పుడూ వింటుండే శబ్దమే. క్రీడాభిరామం, ప్రేమాభిరామం, రసికజనమనోభిరామం వంటి కావ్యనామాలు బాగా ప్రచార సులభాలు. విశ్వదాభిరామలో అభిరామశబ్దం కష్టమైన క్లిష్టమైన శబ్దంకాదు - విశ్వంకష్టమైన మాట కాదు. 'ద' అన్నది కూడా కష్టమైన మాటకాదు - కాని విశ్వద అన్నది సమస్తపదమై అసలు కష్టమయిపోయినదని, అందులోనూ విశ్వద అన్న శబ్దమొకటే అతని మకుటంలోని కంతటికీ అసలు క్లిష్టగంధి తత్వసంధి అని వేమనస్వయంగా చెప్పుకొని వున్నాడు. అతడు విశ్వం ఎలా ఏర్పడుతుందో చెప్పుకోవలసివచ్చిందిగాని అభిరామ శబ్దవిషయం చెప్పుకోవలసినవాడు కాలేదు. నిజానికి విశ్వద అన్న చిన్ని సమాసంలో కూడా అర్థకాఠిన్యం ఏమీలేదు విశ్వశిల్పానికి భగవంతునిపై కన్నా వేరే దిగువగల కారణాలకై, ఇతరమైన కారణాలకై తత్త్వ విజ్ఞానపు ప్రాథమిక పాఠాలవేపుకు దృష్టిని మళ్ళించకోకపోవడముతోనే ఈ కష్టమంతా వచ్చిపడింది. ఇక యీ విశ్వదములందు అభిరాముడు, యీ విశ్వదములకు అభిరాముడు అనడంచేత విశ్వదాభిరామా అంటే క్రింద ఏర్పడే అర్థాలు : ఇవిగో - ఇవీ - ఇవి ఏడు

1. మనోభిరామా (మనోరంజన్ ! చిత్తరంజన్!)
2. మాయావినోదీ !
3. అవిద్యారతుడా!
4. ప్రకృతి మోహితుడా !
5. ఇంద్రియాభిరతుడా! (ఇంద్రియారామా!)
6. పంచభూతారాధకుడా!
7. పంచతన్మాత్రాను మోదీ!

ఇవన్నీ ఇంద్రియవశుడై సానివాడలో ఉన్నప్పుడూ సంసారిగా ఉన్నప్పుడూ, ఇదే మకుటంతో ఇవే అర్థాలతో దాపరికం లేకుండా తన స్థితిని తాను చాటిచెప్పుకొంటూ బూతు పద్యాలను సైతం బాహాటంగా చెప్పి ఉన్నాడు. అది అతని భోగపరత్వ దశను నిరూపించేదిగా వుండిపోతుంది.



ఆ తర్వాత ఇంద్రియాలను నిగ్రహించుకొని, సంసారాన్ని దిగవిడిచి యోగియై జ్ఞానియై నీతినీ, లోకరీతినీ, తత్వాన్నీ, సత్యాన్నీ, యోగానుభవాన్నీ - యోగిమానుల మోసాన్నీ - ఒక్క మాటలో జ్ఞాన విజ్ఞానాలను లోకానికి ఉపదేశించడం కొరకు ఇంకా తాను మనోగత ప్రాణిగానే, ఇంద్రియోప స్థితుడుగానే, ప్రకృతివశుడుగానే, మాయా ప్రశ్రితుడుగానే అవిద్యాభిరతుడుగానే పంచభూతమితుడుగానే పంచతన్మాత్రాభిరతుడుగానే ఇంకా ఎక్కడో అంతరాంతరాల్లో మిగిలి వున్నందుకు తన్ను తాను మందలించుకొంటూ, బుద్ధిగరపుకొంటున్నట్టుగా జీవితాంతమూ అవే అక్షరాలు అవే అర్థాలుగల మకుటుంతోనే ఆత్మ సంబోధనాత్మకంగా లోకోపదేశము చేశాడని చెప్పుకొంటేసరిపోతుంది. వేమన జీవిత ఉభయ దశలతోనూ సందర్భించుతూ సహజమైన అర్థంగలదౌతున్నది అని నాకుతోచింది. ఈ నా యర్థ పరిష్కారాన్ని నాతో భేదించిన ఆచార్య కొర్లపాటి శ్రీరామ్మూర్తి గారు నాథ యోగి మన వేమన గ్రంథంలో మెచ్చుకొన్నారు, ప్రశంసాపాత్రమన్నారు.

నాకు తోచడమే కాదు - వేమన యీ అర్థాలుకొన్నింటిని స్వయంగా చెప్పుకున్నాడు. మన పండిత ప్రకాండులవంటివారే వేమనది కాపుకవిత్వం అని యీసడిస్తూ మకుటం అర్థరహితం అన్నారు - దానితో అనుచరులు తికమకపడ్డారు. అడిగారు. అతడే అర్థవివరణం చేశాడు. అదంతా అచ్చులోనే వుంది. తాటాకులు వెదకనక్కరలేదు - చదివి అర్థం చేసుకోవాలి, చదువుకొక తీరుండాలి. అంతే. ఇక ఇదిగో వేమనవేవినండి :

విశ్వమనగనేమొ వివరించి చూడుడీ
విశ్వమైదుచేత వెలయుచుండు
విశ్వము మదిలోన వెదకి వీక్షింపుడీ, విశ్వ ..... ........
పంచభూతములును పరగ నింద్రియములు
సంచరించినపుడె జగతిగలుగు
సంచరింపకున్న జగమెట్లు కలుగురా విశ్వ .... ......

విశ్వము అయిదు చేతవెలయుననగా పంచభూతములచేత పంచేంద్రియముల చేత వెలయుచుండునని, రెండో పద్యంద్వారా వివరణ యిస్తున్నాడు. ఇంకా విశ్వాన్ని మదిలో - మనస్సులో వెదికి చూచుకోమన్నాడు అనగా, పంచభూతాలు, పంచేంద్రియాలు మనస్సు అన్నవే విశ్వదములు అని వేమన ఉద్దేశమని స్పష్టపడుతున్నది గదా! వేమనపద్యాలలో తమ సొంత పద్యాలు కొన్ని చేర్చిన కొందరి ప్రక్షేపకులకు వేమన గారి యీ అర్థాలు తెలుసు. కుంటినడకగీత పద్యాలు ఒకటిరెండు యీ అర్థంతోనే వేమన పద్యాలని అచ్చువేశారు. గోపాల్ అండ్ కో ప్రతిసంకలనాలలో అవి ఉన్నాయి. తర్వాత తర్వాత వేమన అనుచరులు కూడా ఆ అసలర్థం మరచిపోయారు.



గాఢమైన తత్వచర్చ చెయ్యకుండానే ఒకమాట చెప్పవచ్చు. ఒక్క విశ్వదాభిరామ అన్న పదమే వేమన తత్వార్థమని, తత్వసర్వస్వం అని తార్కాణిస్తుందనవచ్చు. ఆ చిన్నపదమే యివేఅర్థాలతో భౌతికవాదం వద్ద మొదలు పెట్టి అవిద్య మాయమనస్సుతో తన్మాత్రలతో శంకరాద్వైతం, దత్తాత్రేయునితత్వం, ప్రకాశానందుని దృష్టి సృష్టివాదం, వేదాంత బౌద్ధాల మధ్య వెలసినరసిపోతుండే యోగవాశిష్ఠ తత్వం బౌద్ధంలోని విజ్ఞానవాదం శూన్యవాదం, అద్వైతుల పరబ్రహ్మాన్ని అపరిపూర్ణమన్న అచలపరిపూర్ణతత్వం వరకు అతనిలోని తాత్విక పరిణామ దశలన్నింటికీ యీ మకుటం సరిపడిన అర్థచ్ఛాయనిస్తుందని దిఙ్మాత్రంగా సూచించడం చాలుననుకుంటాను. లోతుగావిషయం తెలుసుకొనగోరినవారు విశ్వదాభిరామ వినురవేమయను నా గ్రంథాన్ని చూడవలసింది.

"కామిగాక మోక్షగామికాడు" అని వేమన అన్నందుకు ఆ ఉభయదశలకూ సరిపడే అర్థాలు యిచ్చే మకుటంబకుదరడం నిజంగా ఒక మహాద్భుతం. "పుస్తకజ్ఞానమితనికి ఇంచుమించు సున్న" అన్న రామలింగారెడ్డి మాటలో నడిచిన మనపండితులపాలిటికీ మకుటం ఒకగేలిసేత. అయినది.

ఇవేకా అతని జీవితంలో మరికొన్న విశేషదశలున్నై. ఆ దశలకు మరికొన్ని అర్థాలను యింకా చెప్పుకోవచ్చునని విన్నవించవలసివుంది. విశ్వదము అన్నపదం ఒకగని; ప్రపంచాన్నీ - మించిమరి సమస్తాన్నీ - మనకు కావలసిన సమస్తాన్నీ యిచ్చేదై ఎన్ని అర్థాలనైనా యిస్తుంది.

పండితులు పరిశ్రమించి పైకి తీసిన ఇన్ని అర్థాలు వ్యర్థమై పోనక్కరలేదు. అందులో వాక్యనిర్మాణం అనుమతించని అర్థాలు, శబ్దాలకు సంబంధంలేని అర్థాలుపోగా అవి అర్థాలే కావు గదా - తక్కిన అర్థాలను ఎందుకు వదులుకోవాలి. వాడుకొందాము. ఔచిత్యాన్నిబట్టి అందాన్ని పెంచుకొంటూ వాడుకొందాం. రాళ్ళపల్లి వారి ఆక్షేపణను గడచి గట్టెక్కి బ్రతికే కొత్త అర్థాలు, ఇందులో చూపిన అర్థాలు సార్వజనీనము సర్వ సాధారణము అయిన అర్థాలై అన్ని పద్యాలకు, చెల్లేవిగా గ్రహించి, అయితే కొన్ని పద్యాల సందర్భంగా, ప్రత్యేకించి అందలి భావాలకు అందిపొందే అదనపు అర్థాలుగా, విశేషార్థాలుగా అక్కడక్కడికి అప్పటప్పటికి వాడుకొంటూ వేమన పద్యాలను ఆధికారికంగా ఆస్వాద్యం చేసుకొందాం.

ఇప్పటికింతచాలు. ఇప్పటికేవిశ్వదాభిరామ విశ్వరూప సందర్శనయోగం విశ్వాభిరామంగా ఆవిష్కృతమయిందనుకొంటాను. ఇక్కడ చెప్పకుండా మిగిల్చిన అందాలు, విశేషాలు మరొకసారి చెప్పుకొందాం.



# విశ్వదాభిరాముని ఆర్థిక సిద్ధాంతం

వేమనను సంఘ సంస్కర్తగా గ్రహించామేగాని ఆర్థిక సంస్కర్తగా గ్రహించలేదు. అచల సంప్రదాయం కుల నిర్మూలనాన్ని చెప్పుతున్నదేకాని, వేమనగారి ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వాదాన్ని చెప్పడంలేదు. మాలపల్లి నవలాకర్త ఉన్నవవారు కూడా వేమనను కులధ్వంసకుణ్ణిగానే చిత్రించారుగాని ఆర్థిక ప్రవక్తగా చెప్పలేదు. ఆ తర్వాత ఎవ్వరూ అతనిలో ఆర్థిక కోణాన్ని పట్టించుకోలేదు. ఇటీవల ఒకరిద్దరు ఒకటి రెండు పద్యాలతో అతడు ఆర్థిక విషయాలనుగూర్చి సంస్కరణ భావాలను వ్యక్తపరుస్తున్నట్లు గుర్తించి వ్యాఖ్య చేసి వదలివేశారు. అంతేగాని వేమన సంఘంలో సమూలమైన ఆర్థిక పునర్వ్యవస్థీకరణను కోరినాడని అతడొకానొక ఆర్థిక సిద్ధాంత ప్రవక్త అనీ సూత్రీకరించలేకపోయారు; ఆలాగని ఆనవాలే పట్టలేకపోయారు.

ఇక ఆర్థిక విప్లవం ఆర్థిక విప్లవం అని అహరహం కలవరించే సామ్యవాద, సామాజికవాదాల వాళ్ళున్నారు. వాళ్ళు గురజాడ వీరేశలింగాలను గాలించినట్లుగా వేమనను గాలించలేదు : గాలించడం గాదు, జోలికే పోలేదనవచ్చు. వేమనను సరిగా చూడకుండానే, ప్రత్యేకమైన కృషిచేయకుండానే వేమనను గూర్చి చాలా నిశ్చితాభిప్రాయాలు వెలిబుచ్చివున్నారు.

వేమనలో సామజికస్పృహ (Awareness) వున్నదిగాని సామాజికి చైతన్యం (Consciousness) లేదన్నారు. అతణ్ణి 'భక్తి వుద్యమంలో' వాణ్ణి కూడా జేశారు. సంఘసంస్కరణకు కూడా సంకల్ప పూర్వకంగా పూనుకొన్నవాడు కాదన్నారు. బ్రహ్మంగారితో పాటు వేమన కూడా జీవన్ముక్తిని సాధించమన్నాడన్నారు. వేమనకులనిర్మూలనం కూడా ఏపాటిదిలెమ్మన్నారు. అతడు ఏమంత విజయం సాధించాడన్నారు. అటువంటప్పుడు వేమనగారి ఆర్థిక విప్లవతత్వం వారికసలు అడాపాడా కనపడకుండా పోయింది. దాని మంచిచెడ్డల తూకంమాట ఇంకా ఎక్కడుంటుంది.

కాకపోతే హేతువాదిగా చూచి ఆచారకర్మకాండమీద, ఇంకా సగం మత విషయం ఆధ్యాత్మిక విషయం అయిన కులం మీదా దాడిచేసి, "పురోహిత సంస్కృతి" మీద తిరగబడినట్టు - ఆ తిరుగుబాటు పెట్టుబడిదారీ వ్యవస్థ జననానికి, దాని నేపథ్య దశ అయిన వ్యాపార పెట్టుబడిదారీదశకు (Mercantilism) దోహదకారి అనే అర్థంలో వేమనను వ్యాపారస్థులకవి అని సూత్రీకరించారేగానీ, ఎప్పుడైనా అతనికి ఆర్థికదృష్టి అంటూ వున్నదా అని చూడలేకపోయారు.

మరి కొందరయితే అతని ఆర్థిక దృష్టి విషయం కానకుండానే కులంమీద అతడు చేసినదాడికి ఆర్థికకారణాలేమిటో వూహించి చెప్పబూనుకొన్నారు. అతడుచేసిన కులంమీద దాడికి - బట్టల పరిశ్రమకీ వ్యాపారానికీ రక్తసంబంధాన్ని కనిపెట్టడంగాదు - కల్పిస్తున్నారు;



అంటగడుతున్నారు. భక్తిసంప్రదాయంలో వందలకొలదిగా వున్న చిన్నా, పెద్దా పేర్లతో కబీరు సిద్ధప్పులిద్దరుమాత్రం నేతగాళ్ళు అయినందున, వారు 'కులంమీద దాడి' చేసినందున, అసలు కులంమీద దాడికి బట్టల పరిశ్రమే పుట్టినిల్లు అని, ఆ దాడికి మొనగాడైన వేమన జన్మచేత వృత్తిచేత - అనగా కులంచేత - బట్ట పరిశ్రమలోనివాడని ఏచేనేతకులంలోనో, బట్టల వర్తకంలో వున్న ఏకులంలోనో పుట్టివుంటాడని, కాదు, పుట్టివుండాలని ఊహాశ్వాలను వడివడిగా పరుగెత్తిస్తున్నారు. కాని! వేమ అంటే సంస్కృతంలో మగ్గపుపలక అని, ఆ అర్థం తమవాదానికి బలమిస్తున్నదని కూడా వీరు చెప్పుకోలేకపోయారనుకోండి. అయినా పేరు కులానికి రుజువు కాజాలదు. తెలుగు వేమన్నల పేరు వేపచెట్టు నుంచి వచ్చింది.

వేమనను గూర్చి ప్రత్యేకమైన కృషి చెయ్యలేదని ఒక చెంప చెప్తూనే ఇంతింతమాటలు విసిరేస్తున్నారు. ఇటువంటి సూత్రీకరణలు చేసేస్తున్నారు, వేమన చేసిన ఆర్థిక విచారాన్నయితే అసలు ఆనవాలు పట్టలేదుగాని, అజతీసుకోలేదుగాని, వేమన కులవ్యవస్థ మీద దాడిచేస్తే, అందుకు మాత్రం ఆర్థికకారణం వుండి తీరాలని అలసటలేని అన్వేషణ అలవోకగా చేస్తున్నారు. మార్క్సిస్టుల చరిత్రశోధన యిలావుండగా వేమన ఆర్థిక చింతనా! యత్నమూ వెలుగులోకి రాలేకపోయింది. అదే చూడాల్సి వున్నాం. అయితే అతిక్లుప్తంగా చూస్తాం ఇప్పుడు.

కలిమిలేనివాని కులముదిగునని, <u>కులముకన్న మిగుల కలిమి ప్రధానమయిందని, కులం ఎక్కువ తక్కువల బాధ పేదవాళ్ళకేగాని, కలిమి గలవాళ్ళకు ఆటంకం కావటంలేదని,</u> కుల వ్యత్యాసాలకన్న కలిమిలేముల వ్యత్యాసాలే సంఘంలో ప్రమాదకరంగా పరిణమించాయని - సంఘంలో ఆర్థిక విషయమైన వర్గద్వేషం, వర్గసంఘర్షణ, వర్గసౌభ్రాత్రం రూపుగొంటున్నవని, దారిద్ర్యం యొక్క పరిణామ ఫలమే శివుని దక్షాధ్వర ధ్వంసనగాథ అనీ, పులికన్న కలికన్న ఆకలే హెచ్చు అని, ఆకలి ఆత్యయిక పరిస్థితి అని, అవశ్యం తీర్చాల్సినదని - అయితే అది అంత తీర్చలేని గడ్డుసమస్యకాదని - కడుపుకెట్టులైన కలుగును భుక్తిరా, కడుపురాతిలోని కప్పకు నిండదా, కరవులందైన గడచి గట్టెక్కవచ్చని - అట్టి ఆకలికన్న, విరివి అయినది, అది పెద్దది, వెంటనే తొలగనిది ఆ పేదరికము బహుముఖమని, దారిద్ర్యంవల్ల ధైర్యం నశిస్తుందని, ఆత్మవిశ్వాసం సడలిపోతుందని, లేనికాలానికి లేమిడి మనసు ఏర్పడుతుందని, శుచి, ఘనత, ఆలోచన వివేకము, తాలిమి, పరపతి, దయ, బాంధవ్య బుద్ధివంటి మానవత్వపు లక్షణాలు నశిస్తాయని, అందుచే వ్యక్తి, సంఘము పాడవుతాయని - ధనము లేమియనెడు దావానలంబది, తన్ను జెఱచు మీరిదాపుజెరచు - సముదయంబు నందు సర్వమొక్కటియైన వైరమొదవదేమి (కులము)వారలైన, హెచ్చుతగ్గు లందు నేర్పడనే హాని - కాళ్ళుపోవువాడు కళ్ళుపోయినవాడు ఉభయులరయు కూడియుండురీతి పేదపేదగూడి పెనగొనియుండురాయని పరిశీలనమీద గ్రహించి యున్నాడు.



కలుగువానిబాధ కనుల చూడగలేము అంటూ సంపదవలని బాధలు అనర్థాలు చెప్పి వెక్కసమైనసిరులు మిక్కుటమైన దారిద్ర్యం రెండూ రెండు వైపరీత్యాలని, వ్యష్టికీ, సమిష్టికీ చెరుపని చూపాడు. ఆరోగ్యవంతమైన, మానుషగుణపూర్ణమైన నీతిమంతమైన జీవితం ఆర్థికంగా మధ్యమమైన స్థితిలోనే అది సాధ్యమని, సమాజం మొత్తానికి మధ్యతరగతి మర్యాదసంసారితనాన్ని లక్షించాడు, బోధించాడు.

మంచితనమంతా పేదలసొత్తని, పేదగా బ్రతకడమే పుణ్యమనీ, పేదకే స్వర్గద్వారం తెరుచుకొంటుందని, దారిద్ర్య సంకీర్తనం ఇతర మతస్థులలాగా చెయ్యలేదు. పేదలకు ఐహిక జీవితంలోని కఠినసత్యాలను బాధలను మరచిపొమ్మని, లెక్క చెయ్యద్దనీ, దొరకనున్న స్వర్గానికై ఎదురుచూస్తూ కూర్చోమని చెప్పలేదు. సంపద పాడు చేస్తుంది, దాని జోలికి వెళ్ళవద్దని దృష్టి మళ్ళించలేదు. సొంతలాభం, కొంతమానుకుని పొరుగువాడికి తోడుపడమని గురజాడ కన్న ముందుకు వెళ్ళి కాదు అతడు చెప్పింది, సంఘంలో సమూలమైన ఆర్థిక పునర్వ్యవస్థీకరణము నతడు కోరాడు. వ్యక్తి తనకు ఉన్నదాన్ని ఇతరులకు పెట్టవలెనన్నాడు. సంపదపునర్విభజనే అతని లక్ష్యం - మితమైన ఆస్తి మనుష్యుని వ్యక్తిత్వానికి అవసరం అన్నాడు. "గోచిపాతకన్న కొంచెంబు మరిలేదు" - గొప్పలేని బుద్ధికొంచమై పోవురాయని ఆకలితర్వాత సమస్యల్ని చెప్పి, తల్లి బిడ్డలకును తగవులబుట్టించు ధనముకూడదని వచింత్రుగాని గడనలేక గడచుట ఎట్లురా యని ప్రశ్నించి మరీ అందుకై ప్రతివానికి ధనము ఆస్తికొంత వుండాలన్నాడు.

పేదఱికము నిర్మూలనమే అసలు అతని అంతరాంతరాల్లోని తపన - ఆదినుండి అదేతపన. అతడు వట్టి బోధకుడుగా ఆరంభించి బోధకుడుగానే ముగిసినవాడుకాదు. ఇంద్రియలోలతా దశ కన్నా ఆదిలో పేదల కొరకు ఉద్యమించినవాడు. ఉగ్రపంథత్రొక్కి, ప్రజలను త్రొక్కించినవాడు.

ద్రోహబుద్ధినైన దొంగరికమునైన, సటలనైన సాహసమునైన
సంపదధికునుండి సాధించిధనమును బడుగుకిచ్చుటొండెబాగువేమ!
అదురుబెదురులేక అన్యులసొమ్ముల దానమిచ్చువాడెదాతవేమ యని
పరులకుపకరించి పరులసొమ్ముపరునకు పరగనిచ్చునేని పరముగలుగునని

దానాన్ని, దాతృత్వాన్ని కొత్తదారులు త్రొక్కించాడు; కొత్త నిర్వచనాలు చేశాడు. దానితో ఉద్యమమే జరిగివుండాలి. మాలపల్లి నవలలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు చిత్రించిన ధర్మకన్నాల సిద్ధాంతానికి చరిత్రలో వేమన జనకపాదుడుకావచ్చు. కలవాళ్ళను కొట్టి

లేనివాళ్ళకు పెట్టడం ధర్మం, కర్తవ్యం అన్నభావం అతనిది. వైష్ణవ భక్తుల సమారాధనంకొరకు, తిరుమంగై ఆళ్వారు, జంగాలకు తినిపించడంకొరకు కన్నద బ్రహ్మయ్య వంటి వైష్ణవ శైవ భక్తులు తమతమ మతాలవాళ్ళను మేపడానికి దొంగతనం చేశారు. అది మతస్థులబుద్ధి - వేమన మాత్రం మతభేదం చూడకుండా పేదవాళ్ళందరికీ కొల్లసొమ్ము పెట్టమన్నవాడు. వాళ్ళది మతదృష్టి - వేమనది మత ప్రసక్తి లేని సాంఘిక ఉదారదృష్టి

దోసకారియైన దూసరికాడైన పతితుడైన వేదబాహ్యుడైన
వట్టిపేదవాని కీదగునీవి విశ్వ .... .... .... అన్నవాడు

ఈ బోధలతో సంఘంలో శ్రీశైలం, కందుకూరు, కడపల మధ్య - 17వ శతాబ్దంలో వేమన ఇటువంటి ఒక ఆర్థిక వుద్యమానికి కారకుడై వున్నాడు, అనుకొంటాను. తర్వాత కాలంలో వెంటనే సర్వాయిపాపడి తిరుగుబాటులో నెల్లూరు హనుమంతు అనేవాడు తెచ్చినాటిన భావాలు - కలవాళ్ళనికొట్టి పేదలకు పెట్టడం అన్న భావాలు - సర్వాయిపాపడి బుర్రకథలో వున్నవి. కాని ఆ ఉద్యమం ఎక్కిరాలేదు. విఫలమయి ఇక బంగారం చేసి పేదలకు పంచుతానని పోయి రసయోగంలో పడ్డాడు. యోగంలో పడ్డాడు అనుకోవచ్చు. తత్త్వమంతా తరచితరచి తత్త్వానికీ, తాను దర్శించిన ఆర్థిక వ్యవస్థకీ సమరసకుదుర్చుకొన్నాడు. మళ్ళీ జనం మధ్యకు సంఘంమధ్యకు వచ్చాడు - తత్త్వంతోను, ఆర్థిక బోధతోనూ కూడా మళ్ళీవచ్చాడు. అప్పుడూ కూడా ఆర్థిక పునర్వ్యవస్థీకరణ మాటమానలేదు.

అందుకుగాను లేనివాళ్ళకీ వున్నవాళ్ళకీ మధ్యనే పెళ్ళిళ్ళు జరగాలని అలా జరిగితేనే మధ్యతరగతితనం ఏర్పడుతుందని వివాహసంస్కరణ చెప్పసాగాడు. కన్యాశుల్కం లేకుండా పెళ్ళిళ్ళు కావాలన్నాడు. ఆనాడు అదే పెద్ద సమస్య. పేదయింటి మగపిల్లలకు కలయింటి ఆడపిల్లలను ఓలి (కన్యాశుల్కం) అడగకుండా పెళ్ళి చెయ్యాలన్నాడు. కలవారు కలవారితోనూ - లేనివారు లేనివారితోనూ మనువులందుకోరాదన్నాడు.

కలిమిజూచియాయక్రయమిచ్చినట్లుండు సమునకీయచూడ సరసగుణమె
పేదకిచ్చు మనువు పెనవేసినట్లుండు....
సకలసంపదలను స్వారస్యములజూచి వలచియిచ్చుమనువువాడిపోవు
సమమురానిమనువు చాలగాఫలియించు....
పేదకిచ్చుమనువు ప్రబలువేమ

కలవాళ్ళను దానధర్మాలు చెయ్యమని ఉదారబోధ ఎంతెంతో అందరిలాగ చెయ్యడమే గాదు, అలా చెయ్యకపోతే వచ్చేజన్మలో కటికపేదవై పుట్టి అడుక్కోవలసి వచ్చి, పెట్టేవాళ్ళు లేకుండాపోయి అలమటిస్తారని ఉత్తరజన్మలో బాధలనుచూపి కలవాళ్ళను



భయపెట్టాడు. మతభావాలనువిశ్వాసాలను కలవాళ్ళను భయపెట్టడానికి వినియోగించిన ఏకైక ఉదాహరణ మాత్రుడు వొక్క వేమనే.

తాముబలిమిపెట్టతమకుబల్మినికల్గు, అడుగనిడినతామునడుగగల్గు
ఇందునీనివానికెందును కలుగదు... ...
తామొరులకొసంగ తమకదియేకల్గు ....
తాముగడన సేయుధనము తమదటంచునమ్మియుండు వెర్రినరులు భువి
తామునొకరికిచ్చు ధనమంతయేగాక కడమదితమకేలగలుగు వేమ!

ఈ విధంగా దానధర్మ ప్రబోధం చేసేప్పుడు కూడా వేమన ప్రత్యేకత వేమనదే - అదీ అతని ఆర్థిక పునర్వ్యవస్థీకరణకు లోబడినదిగానే వుండి విశిష్టంగా కనిపిస్తుంది.

అంతేకాదు, అతడుబోధించే అర్థికమాధ్యమికవాదం సర్వానికి సొంత శ్రమే మూలం. శ్రమపడకుండా గడించడం, బ్రతకడం నేరమన్నది అతనిభావం. చెమట కారునట్లు శ్రమపెట్టి దేహంబు గడనచేసికూడుకుడవవలయు, తల్లిదండ్రిసొమ్ము తాఁదింటకారాదు, అని తెగవేసి చెప్పాడు. అంటే ఆస్తిపరంపరాసంక్రమణను తీసివేయమనికూడా భావిస్తునట్లేగదా! మన పూర్వులు కూడా స్వార్జితమ్‌విత్తం ఉత్తమం వుత్తమం అన్నారుగాని పిత్రార్జితమ్ మధ్యమమ్ అని కొంత గౌరవం యిచ్చారు. వేమనమాత్రం పిత్రార్జితాన్ని కూడా తీసేసి రద్దు చెయ్యాలనే భావం చెప్పాడు - స్వార్జితమేవ విత్తమ్ భోగ్యం అని దానికి సవరణదెచ్చాడు వేమన.

కాయకష్టం పేదగానేకాదు, కలిగినప్పుడుకూడా చెయ్యాల్సిందేనన్నాడు. ఉన్నవాడైనా ఉన్ననాడైనా కాయకష్టం మానగూడదన్నాడు. ఉండి కష్టపడేవారిని ఎగతాళిచెయ్యడం తప్పన్నాడు. కష్టపడే కలవాళ్ళను సమర్థించాడు. కష్టించిగడించి, కోరితే యితరులకు పెట్టేట్లుండాలన్నాడు.

కలుగుకాలముననను కష్టించి కష్టించి అయినదినసములను అన్యులకును
కోరఁబెట్టువారు క్రూరులెయౌదురా? యని ప్రశ్నించాడు. వేమన అన్నాడు.

కష్టము చేసి జీవించుము. కష్టమొకనికి కోల్పోకుము, కష్టమునుండి దానమిమ్ము అన్నది వేమన బోధ.

కలుషితార్జనములు కలవారిలలోనూ పేదవారిలోనూ వున్నవన్నాడు. యాచకత్వము, దొంగతనము, అప్పుజేసియెగబెట్టుట వంటి మెసాములే లేనివారి కలుషితార్జనములన్నాడు. దొడ్డవారమనుచుత్రోవడొంకలుగట్టి, అడ్డమైన జనులనంట గట్టిదోచుకొన్న యట్టిదోషము, వాగులడ్డుగట్టి పల్లకాడులుదున్ని మునునడచుత్రోవ ముఁడ్లు కొట్టి పైరుబెట్టుపావులూ ఆయనగారి కలుషితార్జనాపరుల జాబితాలో వున్నారు. ఉమ్మడి భూములను అపహరించే మోతుబరులను తెగడినాడు. అప్పుదీసుకొన్నవారు తాకట్టు బెట్టిన వస్తువులను పరికరాలను



అభరణాలను వాడుకోవటాన్ని ఖండించాడు. దానికి పరిహారం యివ్వాలన్నాడు. స్థితివిషమించి యిరకాటంలోపడి అత్యవసరంగా ఆస్తి అమ్ముకోవలసివస్తే - పరుని అవసరాన్ని నీ లాభానికి ఉపయోగించుకోవడంలో కలుషితార్జన ఉందన్నాడు. అసలు హీనక్రయాలు చెల్లనేరవుఅన్నాడు. దొంగతూనికలు దొంగకొలతలు కలుషితార్జనమని ఖండించాడు. సరిహద్దులు గదుముకోవడం కలుషితార్జనం - వెట్టిచేయించుకోవడం కలుషితార్జనం. Bond-Slaveryని రద్దుచెయ్యవలసిన పని యింకామనకున్నదంటున్నాం - వెట్టి చేయరాదు విభుడెంతఘనుడైన. అని ప్రబోధించాడు. పరులసొమ్మును పరుల ఆస్తిని కాజేయడం కలుషితార్జనం అని వేమన భావమనటంలో సందేహంలేదు.

పిసినిగొట్టుతనం అతని దృష్టిలో పెద్ద అపరాధం - అది ఆర్థికాపరాధమనే అతని వుద్దేశం. ధనస్వభావమే నిత్యచలనం - దాన్ని నైతం గాలివలె సదాగతి. చేతులు మారటమే దాని లక్షణం. అనుభవమే దాని పరమావధి. నిత్యోపయోగం నుండి తొలగకుండటమే దాని సార్థక్యం. తన తక్షణానుభవానికి - పరులకు పేదలకు - భవిష్యంలో తనకొరకు తనవారికొరకు - మూడుగా భాగించమని కూడ వేమన బోధ. అర్జన వ్యయం కొరకు, దానం కొరకు - దాని గమనాన్ని నిరోధించరాదు. కూడబెట్టి, దాచిపెట్టి దాని చలనాన్ని నిరోధించటం నేరం. పిసినివాని దొపరికం సంఘవ్యతిరేకచర్య. ధనస్వాభావానికి వ్యతిరేకచర్య. అందుకే పిసినిగొట్టు మీద అతని వేళాకోళం అతివేలంగా సాగించాడు. దానిపై కోపం అతనికి అత్యధికం.

పిసినివాని యింట పీనుగు వెడలిన కట్టెకోలలకును కాసులిచ్చి
పిసినివాని యింట పీనుగు వెళ్ళిన వెచ్చమాయెనంచు వెక్కివెక్కేడ్చురా ... ... ....

అని అనితర సాధ్యంగా అపహాస్యరసపోషణ చేశాడు.

భూమివాదటన్న భూమి వక్కునవన్వ ధనము వాదటన్న ధనమునవ్వ
కదనభీతుజాచి కాలుండునవ్వురా .... ..... అన్నాడు కడకు.

మరో ప్రక్క పేదల నడవడిలోపాన్ని కూడా ఇలా చెప్పాడు : దానమడుగువాడు ధరలోన అధముండు, దానమడుగకున్న దైవసముడని, అప్పుచేయరోత అది తీర్పనియురోత - పరుల మోసపుచ్చి పరధనమార్జించి కడుపునించుకొనుట కానివద్దు, ఋణము సేయు మనుజుడెక్కునెకెక్కునా అని, డొక్క కొరకు మాళ్ళు దొంగిలించడాన్నీ నిరసించాడు.

ఇరుపక్షాల కలుషితార్జనమూ ఇలా చూపించి - తన అభిప్రాయం, పరిష్కారం అప్పులేనివాడు అధికబలాఢ్యుడని - కలిమిలేమి రెండూ తెలివికి హానిరా అన్నట్టు చద్ది మిగులగలుగు సంసార సంస్థితికి అవకాశమిచ్చు వ్యవస్థ - 'కాయకవే కైలాస' అని బోధించిన (కాయకష్టం చేత బ్రతకటయే కైలాసము అన్న) కన్నడ బసవేశ్వరుల వీరశైవ మతోద్యమాన్ని జ్ఞప్తికి తెస్తూ, దానికున్న మతపుతొడుగును కాస్తా ఒల్చేసి, అభివృద్ధిపరచి ఆచరణ పూర్వకమైన

ఆర్థికసిద్ధాంత మొకదాన్ని తయారుచేసి ఆర్థికమాధ్యమికంగా బోధించిన వేమన ఆర్థిక వ్యవస్థాద్రష్టల్లో మొదటివాడు. పేదరికాన్ని నిర్మూలించాలని బోధలేకాదు, విఫలమైనప్పటికీ ఉద్యమించిన అపురూప మహాపురుషుడు.

ఇటువంటి ఆర్థిక మాధ్యమకవాదిని, దారిద్ర్య నిర్మూలనమే అంతస్తవనగా మరిగిపొంగులెత్తి చల్లారిన మహాపురుషుణ్ణి ఏ అర్థంలోగాన్నిండి 'వ్యాపారస్తులకవి' అని నామకరణం చేయడం అన్యాయం? అక్రమంకాదా? అసత్యంకాదా? మరొక మాట దొరకకపోయిందా? వ్యాపారులకు అనుకూలమైన పంక్తి ఒక్కటుందా?

అదలావుండగా బట్టలపరిశ్రమకీ, బట్టలవర్తకానికీ - వేమనకీ, ఆతని కులం మీద దాడికీ ముడివేయడం గూర్చి ఒకటి రెండు మాటలు చెప్పాలి. పశ్చిమదేశాల్లో మన బట్టలకు బాగా గిరాకీ ఏర్పడినప్పుడు - 16,17 శతాబ్దాలలో బట్టలనేతతో, అమ్మకంతో సంబంధం వున్న కులాలు, అందులోని మేధావులు కులవ్యవస్థమీద దాడిచేశారు అనటం నిరాధారమైన సూత్రీకరణ - పశ్చిమ దేశాల మార్కెట్లు మనకు బారంబాటగా తెరచుకోకముందెప్పుడో, బట్టల పరిశ్రమలో వాళ్ళెవ్వరూ ముందుకు రాకుండానే ఇతరకులాలలతోనే కులం మీదదాడి ఉవ్వెత్తుగాలేచింది. యుద్ధరూపం కూడా తీసుకున్నది. 11,12,13 శతాబ్దాల్లోనే కులంమీద దాడి వేడిగా వాడిగా సాగింది. 12వ శతాబ్దంలో వీరశైవ వీరవైష్ణవాలు కర్నాటకంలోనూ, ఆంధ్రలోనూ కులాన్ని కూల్చవచ్చాయికదా! బసవేశ్వరుడు బ్రహ్మానాయుడు బట్ట పరిశ్రమలో వాళ్లుగారు. వాళ్ళ అనుయాయుల్ని అభిమానపుత్రుల్ని ఆయా జాబితాల్లో వెదికితే వారెవ్వరూ నేతగాళ్ళు కారు - బట్టల నేతర్లూమ్మకంవారుకారు. బ్రహ్మన్న ఏడుకులాల అభిమాన సంతానంలోనూ నేతగాడులేడు. బసవేశ్వరుని అనుచరులు మాటపద్దెనిమిదిమందిలో నేతకులంలోని వారొక్కరూలేరు. 13వ శతాబ్దం నుండే పండరీపురం కేంద్రంగా లేచినవార్కరీ సంప్రదాయంలో (రామకృష్ణహరి)నూ అదేకాలంలో లేచిన మహారాష్ట్రుల మహానుభావ లేక జయకృష్ణ సంప్రదాయంలోని అనేకానేకభక్తులలో సంతులలో బట్టలునేసినకులంవాళ్ళేలేరు. ఈ రెండు సంప్రదాయాలూ కులాన్ని కాదన్నవే; మహానుభావ సంప్రదాయప్రవర్తకుడు మరీ ఎక్కువ బోధించాడు. యాదవరాజు మహాదేవుని ముఖ్యమంత్రి హేమాద్రి (చతుర్వర్గచింతామణికర్త) ఆతణ్ణి అనగా చక్రధరుణ్ణి హత్య చేయించాడు. బసవకల్యాణం, పల్నాడు, అన్నోతి భీకరమైన కులవ్యతిరేకోద్యమాలనుచూచినై.

7,8 శతాబ్దాలనాటినుండీ వున్న తంత్రసంప్రదాయం కులవ్యవస్థకు వ్యతిరేకమయినది. అందులో నేతకులంవాళ్ళులేరు. నవవిధకన్యలని చెప్పబడినవారిలో చేనేత కులం వాళ్ళు కులాలు లేరు. తమిళదేశంలోని 63 శైవ నాయనారులలోను, 12 మంది వైష్ణవ ఆళ్వార్లలోనూ - భక్తుల్లోనూ నేతకులాలు లేవు. భక్తి ఉద్యమాల్లో చేనేతవారు

ముఖ్యులుగాలేరు. కబీరు ఒక పెద్దపేరు, సిద్దప్ప ఒకచిన్న పేరు, డసిమయ్యది ఇంకా ఒకటీఅరా చేనేతపేర్లు బట్టల పరిశ్రమనుంచి తీసి, చేనేతకులాలే బట్టలపరిశ్రమే కులవ్యవస్థ మీద దాడికి నాయకకుల మయిందని తీర్మానించడం మరి తప్పు కాదా?.

మతాచార విశ్వాసాలను, వాటితోకూడా పెనగొనివున్న కులవ్యవస్థని సడలించడం పెట్టుబడిదారీ విధానం పుట్టుకకు, పెంపుకూ అనుకూలమైనదే కావచ్చు. నిజంగానే కాని అది తప్పనిసరికాదు. మతం బిగుసుకొంటూ పెట్టుబడిదారీ విధానం పెరిగిన ఉదాహరణలున్నాయి. జపానే ఒక ఉదాహరణ. 'జెన్' బౌద్ధమతం కంటె వెనుకకు మళ్ళి, పాతషింటో మతాన్ని పనిగట్టుకొని ముందుకు తెచ్చుకొని కూడా జపాన్ పారిశ్రామికీకరణ సాధించింది. కులాలతోనే ఇండియా కేపిటలిజాన్నే కాదు సోషలిజాన్ని కూడా చూస్తుందేమో ననిపిస్తుంది!

ప్రత్తిపంటతో, గింజ తియ్యటంతో, ఏకులు చెయ్యటంతో, నూలు వడకటంతో, నేతతో, నేసిన బట్టకు రంగులు అద్దడంతో, బట్టల అమ్మకంతో ఏఏ కులాలు ముడిపడివున్నాయో ఆయా పనులు ఆ కులం అడ్డంకులతో ఎలా 16వ శతాబ్దికి ముందు కుంటుపడినవో వూహించనేలేము. చరిత్ర అందుకు అవకాశం కల్పించడంలేదు. ఇదంతా పారిశ్రామికీకరణకు ముందు రోజుల విషయం. నేతతో బట్టల పరిశ్రమతోనే వేమనను ముడిపెట్టినది. రాంభోట్ల కృష్ణమూర్తి గారు వేమ అంటే నేతపలక అని కూడ అర్థం చెప్పలేక పోతూ ఇలా సిద్ధాంతించగలిగారు.

ఉర్వివారినెల్ల ఒక్క కంచము బెట్టి, పొత్తుగుడిపి కులము పొలియ జేయాలన్న వేమన్నను బట్టపరిశ్రమలోకి నెట్టడం ఆ బట్టల పరిశ్రమను-కులం మీద దాడికి నిలయమనడం అంతా మనదేశంలోని మార్క్సిజం దురదృష్టం. మన సొంతశ్రమ, సొంతఫలితాలు బొత్తిగాలేకుండా కొందరి వైదేశికుల ఉపరిశోధన మీద కేవలం ఆధారపడి మనచరిత్రకూ సంస్కృతికీ వ్యాఖ్య చెప్పడం మార్క్సిజానికి ఉన్నతి కాదు. గతితార్కిక, చారిత్రక భౌతిక వాదం రెండూ రెండు కళ్ళుగా చూచుకొంటే ఏం ఫలం? అవి గాజుకళ్ళుగా మారిపోకుండా చూచుకోవాలి. మియాపియావ్యాధికి గురి కాకుండా చూచుకోవాలి.

ఆర్థికంకన్నా అన్యకారణాలుంటవని ఆచరణలో చూచి, చూపగలగాలి. అదిలేకుండా, మార్క్సిజం ఆర్థిక నియతివాదంకాదు, కాదని మార్క్సు ఎంగెల్సు చెప్పారంటే సరిపోదు. పరిశోధనలో ఇప్పుడు కూడ ఆర్థిక నియతివాదులం కామని రుజువు చేసుకోవాలి. వేమన్నను బట్టల పరిశ్రమవాడనడం - కులంమీద దాడి బట్టల పరిశ్రమలోనిదనటం - వేమన వ్యాపారస్తులకవి అనటం, మార్క్సిజాన్ని ఆర్థికనియతివాదంగా చేస్తున్నారనడానికి ప్రబలనిదర్శనం అవుతోంది. కులవ్యవస్థమీద వేమన తిరుగుబాటుకు ఆర్థిక కారణాలను వెదికేముందు వేమనకు ఆర్థికవిచారకుడిగా వెలకట్టడం నిలబెట్టడం అవశ్యకర్తవ్యమని గుర్తుంచుకోవాలి.